# కంకణము

కృతికర్త:

భోగరాజు నారాయణమూర్తి
విజయనగర సంస్థానాస్థానకవి
విజయనగరము

రెండవకూర్పు

1930

కాపీరైటు - రిజిస్టర్డు] [వెల 9 అణాలు

# FOREWORD

The literature of a living and progressive nation shows a healthy change when it comes into contact with the literature of another nation It is only the unthinking that apotheosize what is their own and condemn whatever belongs to others. Modern Telugu literature has been adopting new methods of expression and discovering new channels of activity under the influence of English thought and literary criticism. This is a happy sign foretelling a new era of unrealised possibility and undreamt of achievement, in the near future.

The allegorical poem of Mr. Narayanamurti is original in its central conception and ideas. The life-history of a drop of water,—its mysterious birth and experiences, earthly and heavenly,—is in itself a colourful theme allowing scope for many a purple passage of description. The inferior artist would have remained contented with giving that life-story in graceful and charming language. But, Mr. Narayanamurti is a poet in the true sense of the term, a man who sees the inwardness of things; hence, he so treats the subject that it at once becomes brimful of suggestion throwing light on many intricate problems of the human soul. The drop of water lives much the same life as the human being,—born in mystery, undergoing

experiences that tend to depress and elevate the spirit, cherishing high hopes and great ideals and suffering keen disappointments,—and finally through peace and quietude, attains a status of permanent beauty and dignity. It requires, in the first instance, great imaginative power to see 'the permanent analogy of things', as Shelley puts it, to pursue the inherent comparison between these two apparently so dissimilar objects, a man and a drop of water. Secondly, it requires an equally powerful understanding to unravel, with the help of that analogy, some of the mysteries connected with human life. That is what Mr. Narayanamurti has done here. The poem is no doubt allegorical, but the allegory is not sustained and leaves ample scope for the intrepretative capacity of the reader to understand, in his own way, the inner significance of the minor experiences of the drop of water. The fundamentals are however indicated clearly enough. They are the mysterious origin of the drop of water and man, the sorrows and delights of the two on earth and in heaven, their reincarnations and finally their attainments of an immortal majesty through surrender to the forces of life, and conquest through surrender. The drop becomes a pearl and man a free soul enwrapped in a light not of this world. The conclusion arrived at by the poet seems to point, not to the Advaitic conception of the absorption of the individual in the universal, but to the view that man retains his individuality even after shedding all that is mortal in him. So far about the

framework of the poem and its philosophical implications.

A worthy peom is almost endless in its suggestiveness ; its depths of meaning are well-nigh inexhaustible; its graces baffle any attempt at analysis. The best tribute that criticism could pay the noble composition of a poet would be the silence of admiration. Since, however, the convention of a 'Foreword' requires a specific examination of some at least of the merits of the poem, I would venture on the task.

Take the following verse :

భువిఁ జచ్చిన దివిఁ జొచ్చు, నచ్చటనుజావుఁ గాంచి వచ్చున్ భువిన్
భువి చావుకన్ దివిచావు నాఁగ నిటుచావుల్ రెండు భూతాళికిన్ ;
భువి చావు న్సుఖసుప్తివోలెఁ బడయంబోను గా కక్కటా
దివి చావున్ ననుఁ జావనీకుము కపర్ది స్వామి! మృత్యుంజయా!

The plain idea here is that man suffers death twice, once on earth and once in heaven; the earthly death may very well be received with gladness, like deep sleep. But death in heaven is quite different, more serious in its consequence. The poet seems to indicate however that he is referring not merely to the death which is the termination of life, but to the close of a particular kind of experience. In this sense, while on earth one may die these two deaths a number of times when one's senses are closed to all that is earthly, one enters a state similar to happy sleep (సుఖసుప్తి) and wakes up on the side of divine experience. But even that divine mood is terminable.

Hence the prayer :

"...దివి చావున్ ననుఁ జావనికుము కపర్ది స్వామి. మృత్యుంజయా!"

Take another :

అయ్యయ్యో! యొడలెల్ల జల్లుమనునేలా? యిప్డు నాకేమి రా
నయ్యెన్? దిమ్మిరివోవునట్లునగు నా యంగంబు పోనాత్మన్, భయం
బయ్యెన్ : రాఁగలముప్పు చెప్పఁబడఁగ రాదయ్యెన్ : భయం బేల? నా
కి య్యాబ్రిన్ బ్రదుకంటె గొప్పదగు ముప్పేమున్న దూహించినన్.

The remarkable point here is the presence of fear in the individual's mind precedent to the greatest event in his life, namely the attainment of liberation. It is however a curious fact that mystics very often speak of this fear as a fore-runner of the final burst of illumination. While it is true that there can be no other condition worse than that of being caught in the unsteady currents of life, cool reflection is impossible in that marvellous hour. All the senses and faculties of man are ready to be drowned in the flood of the Divine. And the mortal in man coils back in fear at the ensuing destruction of itself.

There is an abundance of figures of similitude and almost all of them are appropriate and strikingly original.

One verse by way of Illustration :

పరమేశ్వరాభావ సురలభావమ్ము వి
ధాన నాస్తికతాప్రధానమగుచు
సంతతి క్లిష్ట మృష్టప్రబంధం బట్ల
గోచరాఖిలవస్తుగుణము నగుచు

కపటమిత్రుని మైత్రికరణి క్షణక్షణ
జాయమాన క్షయాతిశయమునగుచు
అతి దరిద్రు మహానసాగారమునుబోలెఁ
జూడఁజూడఁగ సర్వశూన్యమగుచు
నిర్ధన మనోరథములీల వ్యర్థ మగుచు
నక్షరాశేషు హృదయము ట్లంగమగుచుఁ
త్యాగరహితు రాజ్యమువోలెఁ ద్యాజ్యమగుచుఁ
దమము గ్రమ్మిన జగ మధమముగఁ దోఁచె.

The diction is throughout highly poetic, wrought with gleaming imagery. It is difficult to **choose from** so much that is excellent. Any one **stanza taken at** random would serve the purpose of illustration.

ఆరాత్రిన్ నిజపర్వపక్షిగత ఘూర్ణాంకూర ముక్తాఫలా
కారస్ఫూర్తుల కానతస్మిత దళత్కుంజాస్యలై, తిర్యగ్భమం
బారణ్యాచిర తాళ్వృంతముల శుద్ధాంబుంబులందున్న కాం
తా రత్నంబులు రత్నకంకణఝుణత్కారంబు లేపారఁగన్.

Maxims pregnant with practical wisdom are sown throughout the composition.

1. ఉత్తములు నిజాశ్రితాళి మహితసిద్ధి కెంతయు సంతసింత్రు మ
ధ్యములు తటస్థులౌదు రనయమ్మధముల్ వలమూనువా రిలన్.

2. * * * సమస్త మీశ్వరవిలాసంబంచు నిష్ఖేద శీ
లాలోలాత్మకులై విపజ్జలధి నుల్లంఘింత్రు ధీరోత్తముల్.

3. * * * * * యమా
యకులం ద్రొక్కిరిఁ తమున్నతుల్ గొని యశంబార్జించు మిథ్యాప్రయో.
జకులంగాక యథార్థధీమణుల మెచ్చంబోదు లోకంబిసీ!

The poem is replete with untranslatable delicacies of touch and expression. The happiest ideas are hit of by a dexterous play upon words which could be the result only of an extensive culture.

It is very pleasant to expatiate on the beauties of a beloved thing, but one should call a halt, even after some time, just for the reason that the occupation is so very pleasing to oneself.

M. SRIRAMAMURTI, M.A.,
*Lecturer in English,*
Maharajah's College, Vizianagaram.

---



M. R. Ry.

P. L. NARASIMHA RAZU GARU

MOKHASADAR

JONNAVALASA

# కృతిసమర్పణము

శ్రీలంబెంపెసలారు జొన్నవలసన్ క్షేమాయురారోగ్యసౌ
ఖ్యాలంకారధనాదికోన్నతుల నిత్యంబుం బ్రసాదించి గో
పాలుండేలుత మత్కృతీశ్వరుని బూసాపాటివంశాబ్ధి
[రత్నశశిన్
శ్రీలక్ష్మీనరసింహభూవిభు బుధాశీరాభిమానాత్మకున్.

సీ. హితులు బంధులుఁ గొందఱెలమిఁ గొల్వఁగ జగ
న్నాథవిలాసమన్ నగరునందు,
నొకనాడు తాను సుఖోపవిష్టుండయి
సరసవిద్యాగోష్ఠి సలుపుచుండి,
నారాయణునకల్లనరునివంటి మఱంది
తనకైనయట్టి సద్గుణధురీణుఁ
డచ్యుతరామరాజాగ్రణితోడఁ గం
కణకావ్య కవితాప్రకారమెల్ల
మిగుల సవిమర్శకంబుగ నవధరించి
మించి నుతియించి యేను బ్రార్థించినంతఁ
గృతిపతిత్వంబు గరుణ నంగీకరించె
శ్రితదయామతి లక్ష్మీనృసింహనృపతి.

ఉ. చాలమృదూక్తులన్ బహుళసత్కృతులం బృధుసాధు
[మాధురీ
శ్రీలఁజెలంగునట్టి తనచిత్తము నుత్తమలీలఁ బోలఁగాఁ
జాలినమేల్ రసాలఫలజాలముతోడన కప్పురంపుఁ దాం
బూలమొసంగెనాకునృపపుంగవుఁడంతదయాంతరంగుఁడై.

ఆ. వె. కావ్యసంప్రదాయగతిని సత్కృతిపతి
కభ్యుదయ పరంపరాభివృద్ధి
వరలునటు తదీయవంశావతారంబు
నభినుతింతు విబుధు లభినుతింప.

ఆ. వె. ఇనకులంబునందు వినుతికెక్కిన క్షత్ర
కోటిలోనఁ బూసపాటివారు
రహిఁవహించి రందు రఘునాథ భూనేత
వంశవర్ధనుఁ డయి వాసిగాంచె.

ఉ. ఆరఘునాధభూమిపతి యాతనియంగన సీతయాంబ సీ
తారఘునాధులట్ల సతతమ్ము పవిత్రచరిత్రులై మహో
దారగుణాత్ములై గనిరి ధన్యులముగ్వుర సత్కుమారులన్
మారసమానరూపులఁగుమారపరాక్రమవిక్రమాఢ్యులన్.

గీ. భూభువన భవనవహన వైభవమునఁ
గీర్తిగను వీఁడు గోపాలమూర్తివోలె
నంచుఁ బితరులూహించి రచించి రగ్ర
బాలకునిపేరు కీర్తి గోపాలుఁడనఁగ.

ఉ. మారనిభుండు రెండవకుమారుఁడు కార్యవిదుండు సన్ను తా
చారుఁడు రామచంద్రనృపసత్తముఁ డాతని సోదరుండు దు
ర్వార విజృంభమాణ మదవారణ గర్వవిదారణక్రియా
దారుణ దోర్బలాధికుఁడు ధారుణిఁ గృష్ణమభూపుఁ డెంత [యుఁన్.

ఉ. ఆలమునన్ ధనంజయనిభాప్రతిమాన పరాక్రమోన్నతిన్
గ్రాలుచుఁ బూషవాడ్విజయరామనృపాలుని దండనాథుఁడై
యేలిక కెన్నియో జయములిచ్చి నుతుల్ గనినట్టి కీర్తి గో
పాల నృపాలుఁబోలు నరపాలురుగల్ల రిలాతలంబునన్.

గీ. సంపదలఁ గీర్తి సంపద శాశ్వతమని
వేలకున్ వేలదాటిన వేతనమును
ఘన తటాక ప్రతిష్ఠాదికముల కొఱకుఁ
దా వ్యయించి యన్వర్థాభిధానుఁడయ్యె.

శా. క్రూరాసింగొని పద్మనాభసమరక్షోణిం బ్రవేశించి దు
ర్వారారాతిశతఘ్నికా ధమధమధ్వానంబులంజీల్చి, త
ద్వీరస్తోమ శిరస్సహస్రములఁ బృథ్విన్ రాల్చి, గోపాలుఁడా
వీరస్వర్గమలంకరించె విభుతో విశ్వాస సేవారతిన్.

ఉ. వాని తనూభవుండు కవిపండితమాన్యుఁడు నాంధ్రసం [స్కృతాం
భోనిధికుంభసంభవుఁ డపూర్వమహోపనిషద్రహస్య వి
జ్ఞానుఁ డమానదానగుణజాత మహోన్నతకీర్తికాయుఁడెం
తే నుతిగాంచె వేంకటపతిక్షితినాధపతంనుఁ డిమ్మహిన్.

గీ. అతఁడు తనదేవి బంగారయాంబ యందుఁ
గనెఁ బెదవిజయగోపాల మనుజవిభుని
నాతఁ డప్పలనరసాంబయందుఁ బడసె
ఘనుల ముువ్వురుతనయుల వినుతయశుల.

గీ. ఘనుఁడు లక్ష్మీనృసింహ భూకాంతుఁ డగ్ర
సుతుఁడు పెదవేంకట క్షితిపతియు మఱియుఁ
జిన్న వేంకటభూపాల శేఖరుఁడును
దక్కటి కుమారవర్యు లౌదార్యమతులు.

సీ. పార్వతీశ్వర పాదపద్మ సేవాసక్తు
రాజ్యాంగకార్య నిర్వహణశక్తు
నౌదార్యధైర్యశౌర్యస్థైర్య నిరతాని
వార్యోపకారైక కార్యధుర్యు
నుతపండితసమాజు శ్రితలోక సురభూజు
విద్యాభినవభోజు విమల తేజు
జోగిజగన్నాథు సుగుణసనాథు మ
హాసాధు సాధురక్షానుమోదుఁ
బాత్రుసుపవిత్రు నొకపుత్రు భవ్యగాత్రుఁ
గాంచె లక్ష్మీనరసయాంబికా కళత్ర
గర్భశుక్తి మహామౌక్తికంబనంగ
స్థిరయశశ్శాలి లక్ష్మీనృసింహమౌళి.

ఉ. నాదనఁ డాత్మసంచిత ధనప్రచయంబది, చేయి సాచినన్
లేదనఁ, డీమహోపకృతి నీకృపఁ గావలెనన్న నెన్నఁడున్
గాదనఁ డిట్లు సార్థకతగాంచెను జోగిపదంబు శ్రీజగ
న్నాథ ధరాతలాధిపుని నామమునం దదుదారవర్తనన్.

మ. మతిమంతుండు గుణాఢ్యుఁడో విజయరామక్ష్మాతలాధీశుఁ [డున్
గృతపుణ్యవ్రతయుం గృపావృతయునౌరీ వామహాదేవి తా
మితఁడే యోగ్యుఁడితండె పూజ్యుఁడు నితండే మామహా [గౌరవో
న్నతికర్హుండని మెచ్చుకొందురు జగన్నాథావనీనాథునిన్.

గీ. ఘనుఁడు జోగిజగన్నాథమనుజపతికి
వినుత వేంకటరమణ నామంబును ఘటించి
తగినపతి కన్నివిధములఁ దగిన సతిని
గూర్పఁడను దుర్యశముఁ బాపుకొనె విరించి.

చ. విడువక ధర్మచింత తనవెంటనె నిత్యశివార్చనా విధిన్
గడుగొని యాచరించు గుణగణ్యమహామతి ధర్మపత్నిచేఁ
బడసెను దద్విభుండతులభాగ్యయశోభ్యుదయాతిరేకముల్
పడతి యదృష్టసంపదనుబట్టి కదా పతివైభవోన్నతుల్.

ఉ. సచ్చరితుల్ గుణాఢ్యులు యశస్తవనీయు లుదారవర్తనుల్
నిచ్చలు రాజదంపతులు నిర్మలభక్తి నుమామహేశులన్
బచ్చనియింట భక్తిమెయిబంగరుపూవులఁ బూజసేయఁగా
నిచ్చిరివారు వారలకు నేవురు ధీవరులౌ కుమారులన్.

సీ. తనతండ్రిపేరు వెట్టుచు నగ్రజునకు ల
క్ష్మీనృసింహాభిఖ్య చెలువు మెఱయ
సులలితాకారు నప్పలవేంకటసుభద్ర
భూపుఁడంచు ద్వితీయపుత్రుఁ బిలిచె
నవ్యసద్గుణశాలి నయశీలి వేంకట
నారాయణాభిఖ్య నందనుఁడును
నిర్మలాత్ములు దేవవర్మ మాధవవర్మ
వరుసఁ దక్కటి పుత్రవరులుగాఁగఁ
గాంచి గర్వించి ప్రేమించి మించిపెంచి
యిహమునకు నెల్ల స్వస్తివచించి తాఁ ద
రించి పున్నరకముఁ బ్రవేశించె దివము
ఘనుఁడు జోగిజగన్నాథ మనుజ విభుఁడు.

శా. తాలూకా వ్యవహారభారవహనాధ్యక్షున్ యశశ్శీల వి
ద్యాలంకారు నిజాగ్రనందను నృసింహాధీశునిం బెక్కుచం
దాలన్ వర్ధిలు తక్కుపుత్రుల జగన్నాథావనీనేత తా
నాలోకించుచు సంబుగాంచును మహేంద్రార్ధాసనాసీనుఁడై.

శా. శీలోద్యత్సుగుణాద్యలంకృతులచేఁ జెన్నొందియత్యుక్తిము
ఖ్యాలంకారములన్న లేశమును దాహర్షింపఁ డట్లౌట నే
నోలిన్ మత్కృతినాథు నెంతునుస్వభావోక్తిన్ విసర్జింతుఁగా
వ్యాలంకార విశేషవర్ణనల స్తోత్రాసక్తులౌ వారికై.

శా. రక్తింజెందఁడు గాక స్తోత్రమన సర్వస్తుత్యశీలాదిసం
యుక్తుండౌట నిరంతరం బతిశయోక్త్యుత్ప్రేక్షలెన్నేని న
త్యుక్తుల్ మత్కృతినాథునం దవి స్వభావోక్తిప్రభం
[గాంచెడిఁ
శుక్తిన్ బిందువులెల్లముత్తియములై శోభిల్లుచందంబునన్.

ఉ. తొమ్మిదియేఁడులై తను నెదుర్కొను వారు సమర్థులయ్యు లే
శమ్మును నోటుగానకయె సర్వవిధమ్ములఁ దాలుకాధికా
రమ్ము వహించుచున్న నృపరత్నము మత్కృతినాథునిం బ్రజా
సమ్మతుఁడంట కింతకు నిజమ్ముగు సాక్ష్యమొకండు గల్గునే?

మ. శ్రితులుద్యోగులు వేనవేల్ తనకృపాశ్రీ చేఁగుటుంబాలతో
సతతానేక సుఖాత్ములై మనుచు 'నిచ్చల్ శ్రీనృసింహావనీ
పతిమమ్మేలెడుఁగాక' యంచుహరినింబ్రార్థించిశ్లాఘింత్రు మ
త్కృతినాథున్ స్వకృతజ్ఞతాగుణసమాకీర్ణాంతరంగంబులన్

ఉ. మేదురభక్తియుక్తి నియమించెను దాఁ దన తండ్రి పేరు నా
రాధనసేయు మార్గముగ రమ్యసభాభవనంబు, నాజగ
న్నాథవిలాసనామ భవనంబున నిత్యము నారసింహ భూ
మీధవుఁడిచ్చు దర్శనము మిత్రహితాశ్రితబంధుకోటికిఁ.

శా. బంగారంబు ఫలించు భూములతిశోభాసీమలారామముల్
శృంగారంబగు మందిరంబులు ప్రజాభీష్టప్రభుత్వంబు ని
చ్ఛంగావించెడు సోదరుల్ భవనసాక్షౌల్లక్ష్మీయిల్లాలు నెం
దుంగన్పట్టరు నారసింహధరణీంద్రుం బోలు నింద్రోపముల్.

గీ. పృథివిపతియైన పతియందు విష్ణునంశ
సార్థకమొనర్చి నుతిగన్న చానమిన్న
యుదధి నుదయింపని కొలంతియొకవేఁ గాక
బుచ్చివేంకయాంబను బోలు పొలఁతులుంద్రె.

మ. లలితంబై శుభలక్షణంబయి మహాలంకారశోభాఢ్యమై
విలసత్కాంతి సువర్ణసంఘటితమై విద్యుక్తశిల్ప ప్రభా
కలనంగ్రాలిన కంకణంబును గరాగ్రంబందునం జేర్చి నే
నలఘుప్రౌఢి నలంకరించెద నృసింహాధీశ చూడామణిన్.

గీ. కొడుకు కృతిపతియగుట నెక్కుడగు పుణ్య
పదవి తనకగునన్న సంభ్రమము కతన
నింద్రభోగంబులకు మనసీయఁ డయ్యె
నాకలోకంబునన్ జగన్నాథరాజు.

మ. వినయంబొప్పఁగ వీడెమిచ్చి తనకున్ వింజామరల్ వీచు చో
ఘనరంభాకరకంకణ భ్రమణనిక్వాణంబుకంటెన్ స్వపు
త్రునిభాస్వత్కృతికంకణంబు శ్రుతిమాధుర్యంబుగల్గించె నం
దన మధ్యంగతసౌధమండలి జగన్నాథావనీజానికిన్.

శా. ఆనందించి యితో ధికోన్నతుల దీర్ఘాయుర్యశోద్యత్ప్రభు
త్వానూన ప్రతిభాదికంబుల నృసింహాధీశరత్నంబు తా
నానాభంగులఁ గాంచుతన్ దన దివాణంబందునన్ నిత్యక
ళ్యాణంబుల్ గడుఁబచ్చతోరణములత్యంతంబు భాసిల్లఁగన్.

# విషయసూచిక







అహరహ మస్మదీయ హృదయాంచిత కాంచనపీఠిపై శుభా
వహమగు తావకాకృతిని భద్రముగా నెలకొల్పి భక్తిమై
బహుగతులన్ నుతింతు నెడఁబాయక నన్గరుణించి భారతీ
తుహినకరాననా ! యెటులఁ దోడ్పడెదో నవకావ్యకల్పనన్॥

# కంకణము

—(పూర్వచరిత్రము)—

చ. అణువునయందు మేరుగిరియందును నిత్యము నొక్కరీతి న
య్యనుపమమౌపరాత్పరు మహత్తర తేజము వెల్గుఁగావునన్
గనుఁగొన నొక్క కంకణమొ కా యను నీరసభావమూన కో
యనఘచరిత్రులార! వినుఁడయ్య! మదీయకథావిధానమున్.

చ. జలముల నేర్పడున్ జలదసంచయముల్, జలముల్ జనించున
జ్జలధరజాతమందె; మది సంశయమయ్యె మదీయజన్మమీ
జలజలదంబులం దెటనో; సర్వచరాచరకోటి సాటిగా
నలినభవాండమందె జననంబని మాత్రము విన్నవించెదన్.

చ. ఖరకరు గ్రీష్మభీష్మకరకాండముఖంబున నెన్నిమాఱు లే
నరిగితినో నభంబునకు, నభ్రమునుండి మఱెన్నిసారు లే
నురవడి జారి భూపతన మొందితినో; బుధు లిట్టి జన్మముల్
మరణములుం గణింప రిట మజ్జననక్రమగాథ లేటికిన్ ?

శా. నాపాపం బదియేమొ కాని భువి నానాయోనిసంజాతుఁడౌ
పాపాత్మున్ వలెఁ బెక్కుజీవనములం బ్రాపించుచున్ బుద్బుద
వ్యాపారమ్మున సంచరించితి ననేకాబ్దమ్ము లేత న్మహీ
వాపీకూపనదీనదాదిబహుళాంభశ్శ్రేణిమధ్యంబులన్.

మ. కలరూపంబులతోలంగి సూక్ష్మమగునాకారంబుతోమింటికిన్
బలుమారేగుదు నేగి సర్వభువనావాసవ్యథాఖేదముల్
తలపోతున్ దలపోసి యంబరనటద్ధారాధరాకారని
శ్చలసంచారసుఖంబు శాశ్వతముగా సర్వేశుఁ బ్రార్థించెదన్.

—( కంకణము మేఘంబై సంచరించుట )—

మ. ఒకనాఁడిట్లపయోదమండలగతోద్యోగప్రమోదంబునన్
స్వకులాంభఃకణరాశితోఁ జుత నభోభాగంబునం గామరూ
పకలాకౌశల ముల్లసిల్ల బహురూపస్ఫూర్తులందాల్చి,యా
మకోనం జొచ్చితి మాప్రభాకరు ప్రభాటోపంబు మాటొందఁగన్.

శా. పారావారధరాధరోన్నతతరువ్రాతాపగాఘోరకాం
తారాకారములా, సమస్తవనసత్వప్రస్ఫుటస్ఫూర్తులా ;
నీ రేజోద్భవు సృష్టిరూపముల నన్నింటిండగన్ దాల్చి, రం
గారం జూపితి మప్పు డభ్రతలరంగన్నాట్యరంగమ్మునన్.

సీ. ముత్తమ్ములై పాఱు మత్తేభములఁ గూడఁ
బిల్లయేన్గులు వెంటఁ బెట్టినట్లు
అత్యున్నతములౌ మహాపర్వతంబుల
చుట్టు గుట్టలు కొన్ని పుట్టినట్లు
పేర్చి పెట్టిన దూదిపిండునుండి యనేక
తూలాంకురంబులు తూలినట్లు
సాంద్రనీరంధ్ర వృక్షచ్ఛటాచ్ఛాయలఁ
బలు గుజ్జుమ్రాఁకులు మొలచినట్లు

ప్రకృతి ప్రకటించు నఖిలరూపములతో న
లంకృతం బయి నీలాకలంకసకల
గగనభాగంబు లావేళఁ గ్రాలె నూత్న
కళల మాఖేలనాకలాకలనవలన.

శా. నీలస్నిగ్ధవియత్తలం బనెడు మేల్నిద్దంపు టద్దంబునన్
భూలోకప్రతిబింబ మీాకరణిఁ గన్గో నయ్యెనో; యమ్మరు
జ్జాలంబుల్ గనమర్త్యలోకప్రకృతిచ్ఛాయాపటంబిట్టులా
కాలాఖ్యుండు రచించెనో యనఁ గడున్ గన్పట్టె మాయా
కృతుల్.

—( గంధర్వ గాన వినోద ము )—

ఉ. ఏనిటు నాఁటియాటలను నింత వచింపఁ గడంగ నేటి? కా
నైని లభించినట్టి ఘనభాగ్య మపూర్వము; దాని నెన్నఁగా
నానె? దినావసానసమయాన ననూనవిమానమానగీ
ర్వాణవితానగానరసపానవిశేషము నాకుఁ జేకుఱెన్.

శా. హా! నాపుణ్యఫలం బదెట్టిదొ కదా! యానాఁట నానాట రా
గానర్గ కోకిల కాకలీకలకుహూకారంబులన్ మించు నా
దానందంబున మున్గుచున్ జిలకణంబై యున్న నేనామరు
ద్గానానందసుధన్ సుధాకణమునై కంటిన్ వినూత్నప్రభన్.

సీ. మండువేసఁగిలోని నిండుపున్నమనాఁటి
జాబిల్లి వెన్నెల చలువలందు
ప్రత్యూషసమయసంభవమందమలయమా
రుతకోమలతరంగహతులయందు
పాలబుగ్గలు లొత్తవడ నోరఁ జొల్లూరఁ
బసిపాప లను ముద్దుపలుకులందు
మందారమకరందమాధుర్యధుర్యస
త్కావ్యభవ్యకవిత్వగతులయందు
గలుగు వివిధసుఖంబు లొక్కటన చేర్చి
పేర్చి గానం బనెడు పేరు గూర్చి సకల
భోగ్యముగఁ జేసినట్టి యంభోజభవుని
సృష్టివిరచనావిభవ మచ్చెరువు గాక.

ఉ. ఆయసమానగానవిభవానుభవం బని చెప్పినంతనే
సామెనో లేదో నాకు శ్రవణావధి కెంతయు దాఁటిపోయినన్
దోయకణంబు నేను అలఁ దోయకణంబు నయాచుఁ జింతతోఁ
దోయము వారలం గలసి తోయమండలమందు నుండఁగన్.

— సూర్యాస్తమయము —

శా. ఆటంకంబు ఘటించినార మఁట స్వీయాంశుప్రభావ్యాప్తిక
త్యాటోపంబున భానుఁడావలి మొగంబై మాపయిందానిరా
ఘాటక్రోధవిలోకనాగుణసమగ్రస్ఫూర్తులం గొల్చె; హా
చేటౌ కాలమునన్ సమస్తగతులన్ జేటే కదా వాటిలున్!

ఉ. మాస్థితి కెంతయుఁ గవగచి, మమ్ముఁ గరంబుల నుద్ధరించి, యు
చ్చస్థితిఁ జేర్చె మిత్త్రుఁ డన సత్యమి తం డెయటంచు నమ్మితిన్
స్వస్థత గన్న మాఘనత సైఁపఁగ లేఁడని యెన్న నైతి ని
ట్లస్థిరు నాశ్రయించు నెడ నా దురవస్థ లవిట్టివే కదా?

చ. మముఁ బయికెత్తి దాన నగు మాదగు నున్నతికోర్వలేక దు
ర్భ్రమ గొని మాయెడన్ దన ప్రభల్ గనరా వని యీసుఁ [గాంచె; ను
త్తములు నిజాశ్రితాళి మహితస్థితి కెంతయు సంతసింత్రు మ
ధ్యములు తటస్థులౌ దురనయస్థులు చాలఁ జూతు రయ్యెడన్. ధ్యములుతటస్థులౌ దురనయస్థముల్ చాఁ జూచు వారిలన్.

ఉ. అద్దిర! లోకబాంధవుఁడ నంచును మింటికి నంటి మాకుఁ దాఁ
బెద్దఁట! పెంపుఁ గూర్చునఁట! వింటి రెయీపరి వేషముల్ ఘనో
ద్వృద్ధశకే కదా తలుచు దాఁచ్చుట? స్వార్థపర ప్రసిద్ధులౌ
పెద్దలు! పెద్దలం దెకనిపించును గ్రించుఁదనంబు లన్నియున్.

—(కంకణము వాయువశంబగుట)—

శా. ఆప్తై మాకుపకారివోలెఁ బవనుం డంతంత నే తెంచి, మీ
కూపస్థాజ్ఞత వోవఁగా సకలదిక్కూటంబులం జూచి, ధీ
నైపుణ్యంబు గొనుండు రండనుచు నానాభంగులం ద్రిప్పె మ
మ్మాపూర్వాచలపశ్చిమాచలసమస్తాకాశభాగంబులన్.

ఉ. భూరిపురాకృత ప్రకటపుణ్యఫలానుభవంబు నేటితోఁ
దీరెనొ ఖేచరత్వమును దీరునొ నాఘనసారహారనీ
హారపటీరచారుధవళాకృతుఁ లెల్లఁ దొలంగిపోయి దు
ర్వారవికారగాఢతిమిరచ్ఛవి మాకు ఘటిల్లె నంతటన్.

మ. బలభిద్ఘోరశరాసధారలకు మున్ బాల్గాక తాఁ బుత్రపౌ
త్రులతో గోత్రసమృద్ధిగాంచియవిభీతుండై కుటుంబంబుతో
జలధిం బాసిన మేనకాత్మజు వియత్సంచారమోనాఁగఁడున్
జెలఁగెన్ నాఁడతిభీకరాకృతులమాజీమూత సంచారముల్.

సీ. అమరాధిపతి వీఁడు నాక్రమింపఁగ నాఁడు
దండెత్తి చను సోఁకుమూఁక యనఁగ
దీపంబు లిడి భూసతీమణుల్ గగనంపుఁ
బీఁటపైఁ బాఱించు కాటుక యనఁగ
అంజనాచలశిఖరాగ్రమం దుదయించి
చదలంటఁ బ్రవహించు నది యనంగ
నరకలోకంబున కరుగు ధూర్తుల వెంటఁ
బఱువెత్తు తత్పాపపటలి యనఁగ

ఆ. గుబురుగుబురు లగుచు గుంపుగుంపులు గూడి
యింత లంత లై యనంతము లయి
కడకు నేకమగుచు ఘనఘనాఘనముల
నంచయంబు మింట సంచరించె.

ఆ. చదలు చెదలువాఱఁ జెదపుర్వుల విధానఁ
బొదలు తారలెల్ల, జెదలఁ బాపు
తారుపూఁత తీరు తనరారు జీమూత
జాతమం దడంగి నమసి పోయె.

క. లేశము గనము భవిష్య
న్నాశము, పవమానగతులు నమ్ముకొనుచు ని
ట్లాశాభ్రమణంబున సక
లాశాభ్రమణం బొనర్చి యలసితి మంతన్.

—( వాయునిరసనము )—

మ. గజయూథంబును వేఁటకాఁడినుపచిక్కంబందుఁజిక్కించుపో
ల్కిఁజలింపంగ నెడ మ్మొకించుకయినన్ లేకుండ మానీరద
వ్రజముంగ్రిక్కిరియంగఁజేసెనుసమీరస్వామిమాకర్మమా
ర! జగత్ప్రాణుఁడటందు రాతఁడు జగత్ప్రాణాంతకుండేకదా!

చ. జగములకుం బ్రకంపనుఁడు సైఁపఁగరాని ప్రభంజనుండు వీఁ
డగు, నధికారపుంబదవి కర్హుఁడుగాఁడని యెన్నఁబోక, తాఁ
దగునని జీవకోటికి సదాగతిగా నొనరించె బ్రహ్మ; యె
న్నఁగ నధికారనిర్ణయమునన్ విధి కేవల మజ్ఞుఁడేకదా!

మ. విలసన్మౌక్తికరత్నయుక్తుఁ డతిగంభీరుండు, నానాధునీ
లలనానాథుఁ డనేకజీవనసముల్లాసుండు, కంపింపఁడే
జలధిస్వామి సమీరుబారిఁబడియశ్రాంతంబు; నాహా! మహా
త్ములకైనన్ మఱిశాంతిలేదు కుటిలోద్యోగాధికారంబులన్.

చ. అనలుఁడు తా సమగ్రమహితాగ్రహవృత్తివహింపఁ
[బోత్సహిం
పనె చనుఁగాని శాంతిపరుపం దలఁపం డొకనాఁడుగూడ ని
య్యనిలుఁడు; యుక్తమాతరుణమందొకచల్లనిమాట
[నెన్నఁడే
ననవుకదా మహోన్నతపదాఢ్యులజిహ్వాలువిహ్వాలంబులై.

చ. అటవినితాంతపుష్పనిచయాంతరసౌరభముల్ హరించి,యు
త్కటమగు గంధవాహబిరుదంబునవీఁడుచరించుఁ గంటి రే?
కటకట! యించుకంత యధికారము గల్గినయంతఁ గొంద తే
పటిమయులేకయే బిరుదపద్ధతిఁగొంద్రు యశోభిలాషులై.

మ. అకలంక ప్రసవోత్కరం బడవిపాలై పోవఁ దత్సౌరభ
ప్రకరంబుంగొనుగంధవాహు నెగణింపంజూతురౌరా యు
మాయకులంద్రొక్కి, తదున్నతుల్ గొని యశం బార్జించు [మిథ్యాప్రయో
జకులంగాక యథార్థధీమణుల మెచ్చంబోదు లోకం బిసీ!

శా. ఎన్నో భంగులు లోక మీకరణి నేనెంతన్ విమర్శింతు? నెం
త న్నిందింతు దురంతశత్రుననిలున్, నన్నోబ్లునజ్ఞల్ మహా
పన్నుల్ ఖిన్నత నన్యదూషణ మొనర్పంజూతు రేకాని, మే
లన్నం గీడన నీశ్వరాజ్ఞ నెకదా యశ్రాంతమున్ వాటిలున్.

శా. మేలే కీడగు, సూనృతం బనృతమౌ, మిత్రుండె శత్రుండగున్
శాలే దుర్విషమౌను, బుణ్యమె యఘప్రాయంబుగాఁ [దూలుదు
ష్కాలంబందు; సమస్త మీశ్వర విలాసంబంచు నిష్ఠైదలీ
లాలోలాత్మకులై విపజ్జలధి నుల్లంఘింత్రు ధీరోత్తముల్.

శా. ఈవైరాగ్యము లిన్నినీతులును దా నేతత్తటస్థత్వమున్
భావం బక్కట మర్కటంబు వహియింప న్నేర్చునే? పామర
త్వావిర్భూతసదావివేకమమకారాయత్తమై చిత్త మిం
తే విశ్రాంతిని బొంద దేమిటికి నా కీమెట్టవేదాంతముల్.

ఉ. ఇమ్ముల నున్న మమ్ముల ననేకవిధమ్ములఁ ద్రిమ్మరించి, యా
తెమ్మెర త్రిమ్మరీఁడు పెనుదిమ్మగ నిమ్మెయిఁ గ్రిక్కిఱించె; స్వాం
తమ్మున నింతదారుణ విధానమెటుల్ మఱునంగవచ్చు? స్వా
స్థ్యమ్మెటులూనవచ్చుఁ బగసైఁపఁగలారెవిరాగు లేనియున్.

— అంధకారవర్ణనము —

మ. అకటా! మమ్మటులావియచ్చటులకారాగారమందుంచి, కం
టకుఁడౌ తుంటరి గాలిదయ్యమపు డంతర్ధానమైపోయె; మే
మొకటన్ నింటనుగడ్డ వారిచలనంబొక్కింతయున్ లేక యా
రక వర్షించితి మంధకారఘనధారాపూరముల్ ధాత్రిపై.

క. ప్రాచి నవాచిఁ బ్రతీచి ను
దీచిన్ బహుధాసముత్పతిత వితత తమో
వీచీనిచయము చెలఁగెను
మాచేత నమానచేత మహి నమితంబై.

గీ. భీకరాకృతి సూచికాభేద్యమాన
భూరినీరంధ్రనిబిడాంధకారఘోర
వారినిధిపొంగి జగము ముంపంగ నాఁటి
రాత్రి ధాత్రికిఁ బెనుకాళరాత్రి యయ్యె.

సీ. పరమేశ్వరాభావదురితభావమ్ము వి
ధాన నాస్తికతాప్రధాన మగుచు
సంతతక్లిష్ట దుష్టప్రబంధంబ ట్ల
గోచరాఖిలవస్తుగుణము నగుచు
కపటమిత్రుని మైత్రి కరణి క్షణక్షణ
జాయమాన భయాతిశయము నగుచు
అతిదరిద్రు మహానసాగారమును బోలెఁ
జూడఁజూడఁగ సర్వశూన్యమగుచు
నిర్ధనమనోరథము లీల వ్యర్థమగుచు
నక్షురాపేతు హృదయమ ట్లంధమగుచుఁ
ద్యాగరహితు రాజ్యమువోలెఁ ద్యాజ్యమగుచుఁ
దమము గ్రమ్మినజగ మధమముగఁదోఁచె.

శా. మాకుం గ్రమ్మఱఁగానరాఁ డెచటికమ్మాయానిలుండేఁగెనో
నాకారామచరత్సురాంగనలఁ గానంబోయెనో లేక గం
గాకల్లోలవిలాసడోలికల సాఁగంజొచ్చెనో భూతలం
బాకల్లాడదు నాఁటిరేయిసి సమస్తాశాప్రదేశంబులన్.

ఉ. స్థావరజంగమాత్మకము సర్వజగంబును నాఁడు కేవల
స్థావరరూపమయ్యెను కుజవ్రజముల్ చలనస్వభావమున్
బో విడనాడి పూనెను తపోనియమంబు తమోనివృత్తికిన్
క్ష్మావలయంబు నిశ్చలసమాధిమునింగెను శాంతిమంతమై.

క. ప్రాణాపానసమానో
దానవ్యానములె జీవధారణమునకున్
మేనుల మిగులఁగ మిగిలిన
భూనభముల ననిలచలనములు తొలఁగి చనెన్.

శా. ఆప్పైనుక్కవిమజ్వరాకృతి నవార్యంబై విజృంభించుచున్
దాపోద్రేకము వస్త్రవర్జనము నిద్రాహీనభావంబుని
ర్వ్యాపారమ్ము హిమోపచారమసుఖాహారంబు దుర్వారఘు
ర్మాపూరమ్ము విదాహబాహ్యగతశయ్యల్ గూర్చె మర్త్యాళి [కిన్.

శా. ఆరాత్రిన్ నిజభర్తృవక్త్రగతఘర్మాంకూరముక్తాఫలా
కారస్ఫూర్తుల కానత స్మితదళత్కంజాస్యలై, తచ్ఛ్రమం
బారన్ వీచిరి తాళవృంతములు శుద్ధాంతంబులందున్న కాం
తారత్నంబులు రత్నకంకణఝుణత్కారంబు లేపారఁగన్.

—। మెఱుపులు—నక్షత్రములు ।—

గీ. బంధురవినీల కంధరపటలినుండి
వెడలఁదొడఁగె విద్యుల్లతా వితతు లంతఁ
జటులగహనాంతరోజ్జ్వలజ్జ్వలనజనిత
కీలికాభీలమాలికాకృతుల లీల.

శా. మొండై నింతు నవిద్య, విద్యలవమై మృగ్యంబుగానుండి బ్ర
హ్మాండంబం; దటులయ్యు విద్య యె. యవిద్యం గూల్చు [నంచున్ మహో
ద్దండధ్వాంతవితానముం దొలఁచి సద్యస్స్వల్పశంపాలతా
తండంబుల్ వివరింపఁగాఁదొడఁగె విద్యామానదండంబులై.

ఉ. చెల్లు సమస్తజీవులును జెల్లినయంతనె వానియందు రం
జిల్లు పరాత్పరద్యుతియుఁ జేరును తత్పరమాత్మయందె; మా
చెల్లెడునట్టి కాలమును జేకుఱెనో యన విద్యమానవి
ద్యుల్లతికానికాయము లధోగతి భీతి ఘటించె నక్కటా!

శా. పోయెన్ ముందటిఖేచరత్వ విభవంబుల్ వ్యోమమా నారకం
బాయెన్ బాపులమైతి మేమకట! మాయంగంబులం గ్రుచ్చనుం
దీయంజల్పెడు క్రూరకింకరుల యుద్దీప్తాగ్ని సంతప్త దీ
ర్ఘాయోదండములయ్యె నయ్యెడల యాతాయాతశంపాలతల్.

ఉ. నెట్టనఁ జిట్టచీకటిమునింగిన యట్టి జగంబు మాకుఁ గ
న్పట్టమి నూర్ధ్వదృష్టి పరుపంగఁ బ్రపంచపుదృష్టికడ్డముం
గట్టిన మేలినీలితెరకైవడి మాజలదాళి గ్రాలఁగాఁ
బట్టపురాణులట్లు కనుపట్టెను మాపయిఁ దారకావళుల్.

శా. ఔరారా! పతిరాని రాతురుల మేలౌ నంబరాలంకృతా
కారస్ఫూర్తుల స్వేచ్ఛఁ గాంచెదరు; రాకం గంటిరా తారకా
నాయుల్ మెల్లనఁ జాటుచాటునన యుండం బోదు రేతద్దురా
చారంబుల్ వ్యభిచారకామినులసంచారక్రమంబుల్ గదా!

శా. రాజుం గాంచిన కంటితోడఁ గనిభర్తన్ మొత్తెనన్నట్లుమున్
రాజుం గాంచి పతిన్ మొఱంగె నొక తారాకాంత; నానాదిశా
రాజుల్ తారలఁ గూడునాఁడు వ్యభిచారం బేరు శంకింతు రం
చేఁ జింతించితి నాఁటి తామసపు రేయిం దారలం జూచుచున్.

మ. అకలంకోజ్జ్వలతారలం బొదివి భావాభావమధ్యాల్పతా
రక లంకందునఁ జుట్టుఁజేరె ముదమారన్ రత్నభూషాంబర
ప్రకరోద్యద్రమణీ జనాభరణ సౌభాగ్యంబువీక్షించు వే
డుకతోడన్ నిరుపేదరాం డ్రరిగిచుట్టుంజుట్టుచంకంబునన్.

గీ. తఱుచు తెగి వ్రాలుచుక్కలు ధరణిఁ బడఁగ
నెడములేక నూ మేఘాళి నడుమఁ జిక్కి
యొండొకనభంబు గల్పించుచుండె మాకు
నభ్ర మన్వర్థనామధేయంబు గాఁగ.

శా. దేశంబున్ విడియేగె భర్త, జగమెంతే మెచ్చు మీ మేఘసం
దేశంబన్నను, మాకు నున్నదొకసందేశంబుగొంపోయి మా
యాశల్ దీర్పుఁడటంచుఁ దెల్పుఁడని చంద్రాబ్జాస్యలంపన్ [దదా
దేశంబుం గొనివచ్చు దూతికలరీతిన్ వ్రాలె నత్తారకల్.

మ. అమితోగ్రాకృతినుద్భవించిసకలాశాంతంబులన్ శ్రీమహే
శ మహాలింగము వ్యాప్తమానెడవిరాజత్పారిజాత ప్రసూ
నములన్ వేల్పులుపూజసల్పెడువిధానంబెల్ల మామేచకా
భ్రమున్ దెవ్రాలెడుతారకావళిస్ఫురింపంజేసెమాకయ్యెడన్.

శా. తారామండలమందె యంతవఱకంతర్భూతుఁడై యింటదు
ర్వారాస్త్రంబులఁ గూర్చి మారుతుఁడు మాపైనిం [బ్రయోగింపఁ ద
న్నారాచానలకీలికావళియొనా నాఁడా వియన్నిర్గళ
త్తారావారముమాకపారభయదోత్పాతంబెయయ్యెంగటా.

—( భూపతనముగాకుండఁ గంకణ మీశ్వరునిఁ బ్రార్థించుట )—

శా. ఆయుత్పాతము లుప్పతిల్లుటయు నత్యాకస్మికంబౌ మహా
వాయుధ్వానముమాచెవింబడియెఁ దద్ధ్వానంబువిన్పింపమా
కాయంబుల్ గడుజల్లుజల్లుమనియెన్, గాయంబులున్ జల్లనన్
మాయోగంబున నొక్కజల్లువడియెన్ మానుండి
వ్యోమమండలిన్.

ఉ. తొల్లిటి పుణ్యపాపములతోడనె నాకము నారకమ్ము సం
ధిల్లఁగ వానినిన్ బడసి తీరి పదంపడి భూతధాత్రికిం
ద్రెళ్లెడు జీవకోటులటు ద్రెళ్లె ననేక సహస్రసంఖ్యలై
జల్లున నేలపైఁ బడిన జల్లున మాజలబిందుబృందముల్.

క. ఆతఱి నేతఱి నాతా
ఘాత మధఃపాతగతిని గల్గించునొ యా
స్థితిన్ బింకము సెడి జీ
మూతవ్రాతములు వడక మొదలిడె నకటా.

క. వికలమతిన్ మిగుల వికా
వికలై యిలఁ బడకయుండు వెరవున మావా
రికణము లత్యాతురతన్
జకచక వెనువెనుక కొదువసాగెను మింటన్.

క. ఈ తెఱగున నాభీకర
వాతధ్వానమ్ముకతన వారిదములలో
నూతనసంచలనం బు
ద్భూతంబై మిగుల దిగులుపుట్టించుటయున్.

ఉ. ప్రాంతచరత్వయఃకణకృపాపరిలబ్ధసుఖస్థితిన్ దదీ
యాంతరమందు డాఁగి పవనాహతిఁ ద్రెళ్లకమున్న నిశ్చల
స్వాంతముతో నుమారమణుఁ జర్వితచర్వణమైన యిట్టి జ
న్మాంతరముల్ ఘటింపవలదంచును వేఁడుకొనందొడంగితిన్.

శా. వందే శంకర మిందుశేఖర ముమాప్రాణేశ్వరం సంతతా
నంద శ్రీవిభవప్రదం విబుధసంతానార్చితాత్యుల్లస
న్మందారాంచిత సుందరాంఘ్రియుగళం మన్మాథ మర్కో
[జ్జ్వలం
కందర్పాంతక మంబుజేక్షణసఖం కైవల్య సంధాయకమ్.

శా. వ్యాసాగస్త్యవసిష్ఠనారద భరద్వాజాదిసన్మున్యుప
న్యాసాధారగుణాలయాయ భవబంధత్రాసనాశాయ కై
లాసశ్రీవిభవాయ పంకమయదుర్లంఘ్యోచ్ఛలజ్జీవనా
వాసక్లేశహరాయభక్తహృదయావాసాయతుభ్యన్నమః.

శా. నాకుం జెల్లెనె ఖేచరత్వజనితానందైకభాగ్యంబు ? నా
నాకూపస్థదురంతపంకనిచయాంతర్మగ్న సంతాప మెం
తో కాలంబయి పొందుచుందుఁ గరుణాదూరుండవై
[నన్ను నిం
కేకూపంబునఁ ద్రోయ నెంచితొకదోయీ ! తండ్రి !
[మృత్యుంజయా !

మ. భవఘోరార్ణవవీచికాతరణసంపత్కారణం బెన్నఁగా
భవదంఘ్రిస్మరణంబ! యన్యతరణోపాయంబు లేదింక, నీ
భవసంతాపభరంబు దుర్భరము, నాప్రాపీవె కాపాడు మో
భవదూరా ! యభవా ! భవా ! శివ ! శివాప్రాణేశ !
[మృత్యుంజయా.

శా. నీవారిన్ నిరతంబు నీవు కరుణానిర్నిద్రభద్రాత్ములన్
గావింపం దలపోసె; దేము నభిషేకస్ఫూర్తి నేవేళ నీ
సేవార్చావిధు లాచరించు టెటులోఁ జింతించి మా వారినిన్
నీవారిం బలెఁ బ్రోవఁగాఁ దగదె తండ్రీ! నీకు మృత్యుంజయా!

శా. లోనం బుట్టవు కీటకచ్ఛటలు, కల్లోలంబులుం గల్గ, విం
తేనిన్ వక్రత నేఁగు జీవనములే, దేపంకసంపర్కమున్
గానన్ గాదు; వియచ్చరత్వము సదా కల్పించి నా కీపయిన్
రానీకయ్య! పునర్మహీపతనసంత్రాసంబు మృత్యుంజయా!

మ. భువిఁ జచ్చున్ దివిఁ జొచ్చు నచ్చటను జావుం గాంచి
[చొచ్చున్ భువిన్
భువి చావున్ దివి చావునాఁగ నిటు చావుల్ రెండు భూతాళికిన్;
భువి చావున్సుఖసుప్తిపోలెఁ బడయంబో నొను గాక కట్టా
దివి చావున్ ననుఁ జావనీకుము కపర్దిస్వామి! మృత్యుంజయా!

మ. బహుధాభూతవిలాసకందుకకళా ప్రజ్ఞన్ సదా తన్నుహు
ర్ముహురుద్యత్ప్రపతద్గతిక్రమములన్ మోదింతె?
[యుష్మత్కరా
బ్జహతిన్ మింటికిఁ దూలి నేలఁబడఁగా సంసిద్ధమై యుంటి, నీ
కుహనా ఖేలన మేల నా యెడల నీకుం దండ్రి! మృత్యుంజయా!

శా. గంగాశీతలశీకరప్రకరసాంగత్యంబు దివ్యాంగనా
సంగీతామృతపానవైభవ ముదంచత్కామరూపంబు, నా
కుం గల్పింపుము శాశ్వతమ్ముగ నధఃకూపమ్ము చేకూర్చకో
గంగాసంకలితోత్తమాంగ! భవభంగా! లింగ! మృత్యుం
[జయా!

—౹ వాయువిజృంభణము ౹—

గీ. అనుచుఁ బ్రార్థించుచుండఁగ నంతలోన
నస్తదీశ్వరార్చనమున కంతరాయ
ముం ఘటించినాఁ డఖిలభూభువనభవన
భంజనవిజృంభమాణ ప్రభంజనుండు.

శా. స్తంభీభూత దిగంతపూరిత పయోదవ్రాతసంచాలనా
రంభోద్వేగసమేత దుర్భరతరారావావదీర్ణైక స
ర్వాంభోజప్రభవాండభాండుఁడయి నాఁ డమ్మాతరిశ్వుండు ప్రా
రంభించెన్ బహుధాచరాచరసమగ్రధ్వంససంచారమున్.

ఉ. స్థావరజంగమాత్మకము సర్వజగంబు క్షణంబులో గత
స్థావరమై సమాకలిత జంగమమయ్యెను జంచలస్మహీ
జావళియున్ శిరఃకరకృతాభినయంబులఁ బాడఁజొచ్చెఁ గ
ల్గారెనోనా నిరంతరనిరర్థక జల్పనకల్పనాధ్వనిన్.

ఉ. త్రుళ్లియు నిక్కినీల్గియునుదూఁగియు వాగియువిఱ్ఱవీగియున్
గల్లునుద్రావువాఁడు ధనగర్వితుఁడున్ దుడకొక్కపెట్టునన్
ద్రెళ్లిద రెట్టు లట్టుచెలరేఁగియు నిట్టటు లూఁగులాడియున్
బెల్లుధ్వనించిమించియుగుభిల్లునఁ గూలెమహీరుహావళుల్.

మ. వరలున్ నిశ్చలమానధర్మము జగత్ప్రాణానుబంధంబులన్
బరివర్జించిన యంతకాలము; జగత్ప్రాణానుబంధంబులన్
బరివర్తింపఁగదా ఘటిల్లెను నధఃపాతాతతక్లేశ మీ
సరణిన్ మాకని చాటె నాఁటిప్రపతత్సర్వావనీజావళుల్.

ఉ. భూతలమందుఁబోలె సురభూములయందును భూతకోటికు
జ్జాతము గాక తప్ప దవసానదశావసరంబునన్ మహా
వాతము; నాఁడు బిట్టడలుపాటు ఘటింపఁగఁజేసె నమ్మహా
వాతవిజృంభణంబు భువి వారికినిన్ దివివారికిం గటా!

శా. ఘోరాకారమరుత్ప్రయుక్త భయసంక్షోభంబునన్ మే
[ము ఘీం
కారారావములాచరించునెడఁ గ్రేంకారారవంబొప్పఁగాం
తారావాసమయూరవారములొగిన్ నాట్యంబుగావించెనా
రారా! యొక్కరిఖేద మింకొకరికత్యామోదమౌనేకదా?

శా. పైకిన్ మైత్రినటించి మాపతనమున్ వాంఛించులోలోన, మ
మ్మాకాశమ్మునజూచియేచిపురులల్లాడించుమాత్రంబునన్
గేకివ్రాతము మాకుఁగూర్చునని సంకేతించి వాక్రుచ్చు నీ
లోకం బింతటిగ్రుడ్డిదా యనుచునాలో నేనె చింతించెదన్.

శా. స్ఫారంబై బహుభీతభూతమయి ఝుంఝామారు
[తోద్ఘుష్టహుం
కారంబెందు విరామ మొందకయె యోంకారాను
[కారంబుతో
నీరేజప్రభవాండభాండమునఁదానిండంగ, సాక్షాన్మహోం
కారబ్రహ్మమయంబు లోకమనువాక్యంబప్పు డూహిం
[చితిన్.

— గాలివానలోఁ గంకణము సాగరమునఁ బడుట —

శా. నీరంధ్రాంబుధరవ్రజంబు, త్రిజగన్నిర్మూలనాఖేలనా
పారీణానిలపాదతాడనములన్ బట్టూడి, బిట్టోడి, పె
ల్లారాటంపడి, బింకమెల్లఁ జెడి, నీరై నాటి రేయింగటా!
ప్రారంభించెను దేభతుండనిభధారాపాతముల్ ధాత్రికిన్.

చ. ప్రభువు ప్రకంపనుండయినరాజ్యము త్యాజముగాన రం
[దురం
డభయముగల్గు దేశమున కభ్రములార! యటంచు శత్రుభూ
పుభయము పెంపునన్ వలసపోయెడు తెంపునఁ బోవఁ జొచ్చెని
న్నభము దొలంగి మాఘనఘనాఘనముల్ మహికిం గ్రమం
[బునన్.

ఉ. ఆలయకాలకాలనిభుఁడైన ప్రభంజను తాడనంబులన్
జీలియు వ్రీలియున్ మివులఁ జందరవందరమైన మాపయో
దాలులనుండి నాఁడు కురియందొడఁగెన్ వడగండ్లుఁ గూడఁ గీ
లాలముతోడి మాంసశకలమ్ములలీల నిలాతలమ్మునన్.

ఉ. కొన్ని వనంబులందు నొకకొన్ని సముద్రములందు నింకనుం
గొన్ని కొలంకులందు మఱికొన్ని మహానదులందు నీగతిన్
గ్రన్ననఁ గూలె నీలమణికాంతుల నేలు పయోదమాలికల్
మిన్ను దొలంగి దారుణసమీరణ మారణకారణంబునన్.

సీ. కలుషమ్మెఱుంగ కొక్కటన పెక్కటల
    త్యానందమునఁ గూడి యాడియాడి
సురుచిరబహుదివ్యసుందరీగాన ర
    తి ప్రమోదంబులఁ దేలి తేలి
మిన్నుమన్నరయ కీయున్నతి స్థిరమంచుఁ
    బోరానియాశలఁ బోయిపోయి
కటకట! తుదకుఁ బ్రకంపన బాధకు
    లోనై మనంబున లోఁగి లోఁగి
పొంకమును బింకమును జెడి పొరలువాఱి
ముదుతలంబడి పెనువాతమున మునింగి
నీరు గ్రమ్ముచు నాఁడుమానిఖిలమేఘ
మాలికలు క్రమక్రమముగా నేలవ్రాలె.

ఉ. ఇచ్చటనుండి నేలఁబడనీక ననుం గృపఁ గాచుచున్న మా
నెచ్చెలి మబ్బులన్నియుఁజనెన్, బకువాతఁబడంగఁ బాండ
[వుల్
సొచ్చినయింటివిప్రునకుఁ జొప్పున నాకును సక్రమంబుగా
వచ్చెను వంతు మారుతునివాతఁబడన్ విధినిర్ణయంబునన్.

క. బలహీనులమగు మాపై
బలిసి విరోధించి కూల్పఁబొల్పడిన మహా
బలుబలమును విధిబలము ప్ర
బలమగునెడఁ బ్రోచు భీమబలుఁ డున్నాఁడే?

ఉ. నెక్కొని మింటనుండి తెగి నేలకురాలినరిక్కరీతి, వి
ల్లెక్కిడి వ్యాధుఁడేయ గుఱియేటునఁ గూలిన పక్కిభాతి, నే
దిక్కును లేక నేనకట! తీవ్రతరంబగు మారుతాహతిన్
గ్రక్కునఁగూలినానొకయగాధమహార్ణవమధ్యమందునన్.

—( సాగరమునందలి కంకణము )—

ఆ. వె. కూలి సొమ్ముసిల్లి కులమువారి కృపోప
చారవిధుల సేదదేరి, దైవ
మా! భవార్ణవమున మఱలఁ ద్రోసితె యని
భోరుభోరుమనుచుఁ బొరలి యేడ్చి.

చ. క్రమముగఁ గన్నువిచ్చితినిగాంచితిలోకము, లోకమెల్ల సం
భ్రమమయనుకొంటి బుద్బుదవితానములే ప్రజలంచునెంచి [తిన్
సమతయు శాంతి నిశ్చలత సాగనియిందలి సర్వజీవన
క్రమముల గ్రత్తెఱింగితి నగాధవిషాదపయోధి మున్గితిన్.

ఉ. సంతత మీయపారమగు సాగరమందలి జీవనంబుతో
నెంతయు నంటి యంటనటు లేఁ జరియింపఁగ నెంచి, దేనినా
శింతును నాశ్రయింతు నను చింతమునింగితిఁ గానిజీవనా
క్రాంతముగాని సాధనము గానఁగనైతిని నెన్నిభంగులన్.

ఉ. జీవనధర్మమూనియును జీవనమం దెటు లంటి యంటన
ట్లే విహరింపనేర్తు? నగరే వినిరే నెవరేని నన్ను? నా
కేవెరవుఁ స్ఫురింప కెద నింతతలంచుకొలందిఁ దోఁచు నా
నావిధసంశయమ్ములుమనమ్ముఁగలంచెఁదొలంచె ధైర్యమున్.

ఉ. రమ్మిటురమ్ము సాగరతరంగములందు నుయాలలూఁగఁ జి
త్రమ్మగు కేళిపై గిరగిరన్ సుడులం దిరుగంగ నంచు, లే
శమ్మును దోఁచనీక నను సారెకుఁ బిల్చెడువారి చేత స్వాం
తమ్ము మఱింత నావశము దప్పె నయో పరమార్థచింతలన్.

మ. ఇవికల్లోలములిందుఁ జిక్కుకొనరా, దీవంక నావర్తముల్
తవులం గూడదు వీనియం, దట నగాధంబట్లు పోఁగూడ, దు
న్నవిధంబుండెదనన్న జీవనగతుల్ నన్నొక్కచో నిల్వనీ
వవిలఘ్యంబగు నిట్టిసాగరమునందా చేరితిన్ దైవమా!

క. పృథువిమనిధి యిది క్షీరో
దధియఁట! రత్నాకరమఁట! తన్మధ్యమునన్
బుధవంద్యుఁడు నారాయణుఁ
డధివసియించునఁట! యివి యనౌచితులె కదా!

సీ. కామించి పెక్కుభంగము లోర్చి శృంగితో
మైమఱపూనె నీమద్గురంబు
క్రోధించి కలతిమికులముల నలయించి
పొలియించె నీతిమింగిలము కొదమ
లోభించి యామిషలాభ మన్న్యులకీక
మెసవక యెసఁగె నిమ్మునలి మొసలి
మోహించి స్వకుటుంబమును మేపు చాకొన్న
పయి మీలకొనఁగ దీపాడుఝషము

మదమునఁ గ్రాహమును గడుమత్సరమున
మకరమును నిటుఁ బోరాడుటకుఁ దొడంగె
నకట! దుర్గుణంబులకెల్ల నాలయంబు
సకలభయహేతుభూత మీసాగరంబు.

ఉ. రాగముపోదు, త్యాగమనరాదు, విరాగముగల్గ, దింద్రియో
ద్యోగము మాఱ, దెయ్యెడల యోగము సాగదు, సర్వ [జంతుసం
భోగవిలాసలాలసము భూతవినాశనహేతుభూత మీ
సాగర మెట్టిబుద్ధిబలశాలికినైనను నీదరా దహో!

ఉ. జీవనమందు భ్రాంతిపడి చిక్కుకొనందగ నిందుఁ బెక్కు న
క్రావళు లుండు నెంతటిమహాబలునే న్గబళించుచుండు; దం
తావళవల్లభుండు ఘననక్రముఖంబునఁ జిక్కి స్రుక్కఁగా
రావలసెంగదామును మురారి వికుంఠమునుండి ధాత్రికిన్.

— ముక్తాసక్తితోఁ గంకణము రామునిఁ బ్రార్థించుట —

శా. కారాకూరము; నక్రవిక్రమ, ముదగ్రగ్రాహచక్రమ్ము, దు
ర్వారోత్తుంగతరంగవారమగు పారావారమున్ సంతత
శ్రీరామక్షితినాథపాదయుగళీసేవారతిన్, యోగి సం
సారంబుం దరియించుచందమునమున్ సామీరి లంఘింపఁడే.

ఉ. చంచలకన్నఁ జంచలము సర్వవిధమ్ముల మర్కటంబు; క
ల్పించె నయారె దాని కమలీమసయోగమహత్త్వసిద్ధి, దాఁ
టించె మహాసముద్రము! ఘటించె జగజ్జనపూజనమ్ము! నే
మంచు నుతింపవచ్చు మహిమాఢ్యము శ్రీరఘురామ [నామమున్.

ఉ. రామ! రమాభిరామ! రఘురామ! యశోధనరామ! జానకీ
రామ!పయోజమిత్రకులరంజనరామ!యయోధ్యరామ!సు
త్రామముఖాఖిలామరవితానసతాంఘ్రిసరోజరామ! శ్రీ
రామ! సదాశ్రితప్రకరరక్షకరామ! నమోనమోనమః.

ఉ. అప్పులుదీర వెన్నటికి నప్పులుదీరక పుట్టుచావులున్
దప్పవు పుట్టుచావులటు తప్పనిచోట విముక్తిగల్గ దో
యొప్పులకుప్ప!ఓయినకులోద్భవా!ఓరఘురామచంద్ర! ఈ
యప్పులకుప్పనుండి యెటులైన ననుం దరిఁజేర్చి ప్రోవవే.

శా. ఘూతప్రాక్కృతపాతకమ్ములు, జగత్పూతంబులున్ మంగళ
వ్రాతమ్ముల్ భవదీయచారుచరణాబ్జాతమ్ము లాసించినా
నేతద్భూతమయాకృతిన్ విడిచి నేనెంతేని ముక్తాకృతిన్
జేతఃప్రీతి వహింపఁజేయఁగదవే సీతామనోవల్లభా!

ఉ. భక్తజనావనాంకమును భానుకులాభరణంబ! యిట్టిచో
రిక్త మొనర్పఁ బోక ప్రసరింపఁగఁ జేయఁగదయ్య, [మహాక్తికా
సక్తిని నున్న నాపయిని జల్లని నీకనుదోయి వెంబడిన్
బ్రాక్తనపాపకర్త పరిపాకవిపాక విలోకలోకముల్.

ఉ. భంగములం దగుల్కొను నవస్థయు, వక్రతనేగువారి దు
స్సంగతినొందుదుస్స్థితియుఁజంచలజీవనయాత్రయున్,సతం
బుం గలబుద్బుదాంగమునుబోవిడి దివ్యరుచిప్రయుక్తము
క్తాంగము నొందఁజేయుము దయానిధి! రామ! రఘు
[ప్రభూత్తమా!

—॥ కంకణము ముక్తమైతరించుట ॥—

శా. అయ్యయ్యో! యొడలెల్ల జల్లుమనునేలా? యిప్డునాకేమిరా
నయ్యెన్? దిమ్మిరివోవునట్లయగు నాయంగంబు; లాత్మన్
[భయం
బయ్యెన్ రాఁగలముప్పు చొప్పెఱుఁగ రాదయ్యెన్;
[భయంబేల? నా
కియ్యబ్ధిన్ బడుకంటెఁగొప్పదగుముప్పేమున్నదూహించినన్.

చ. కువలయజీవితాంతకుని క్రూరకరాయతపాశభీతి నా
కవునను కొంట కట్టిసమయమ్మునుగా దలువంటిచిహ్నలె
య్యవియనుదోవ;వూరకభయంపడనేమిటి?కింతకుఁ శుభం
బవునొకొ నన్ను దైవము దయామయదృష్టులఁ జూచె
[నేమొకో.

చ. కళలు తొలంగి రాహువుముఖంబునఁజిక్కి విముక్తమైన య
ప్డలఁతి యలంతిగా ధవళమై కనవచ్చు సుధాంశుబింబ మ
ట్లలఁతియలంతిగా ధవళమై కనవచ్చెడు నాదుమేను ని
మ్ముల ననుఁగూడ నీశ్వరుఁడు ముక్తి నొనర్చునె యిమ్మ
[హోదధిన్?

మ. ధవళంబైన కొలందిఁ గంటికిసమస్తంబున్ గడున్ వింతగా
ధవళంబై కనవచ్చుఁ; జిత్త మిపు డేతత్సాగరంబన్న భీ
తి వడంబోక, సమత్వముం జెడక, శాంతింబొంది
[యుప్పొంగు; నిం
తవిశేషంబగునూతనత్వ మెటు లొందంజాలినానొకదా!

శా. హేయం బంటిని సాగరంబు; నిపుడెం తేనిన్ మనః ప్రీతి సు
శ్రేయంబున్ శుభదాయకంబుననుచుం జింతింతు; నెందేని [యున్
శ్రేయోశ్రేయవిచారనిర్ణయము భాషింపంబడుఁ దానవ
స్థాయ త్తమ్మగు చిత్తవృత్తి కనుసార్యంబైన భావంబునన్.

శా. కల్లోలంబులు గానరావెచట, వైకల్యంబులే కార్తిలే
కుల్లం బూరటఁగాంచె, సాగరగతోద్యోగంబు లీలావిలా
సోల్లాసంబుగఁ దోఁచె నార్తజనరక్షోపాయపారీణుసా
త్త్వోల్లక్ష్మీశకృపామహత్త్వమున ముక్తాకారముందాల్చితిన్.

గీ. ధవళమయి నన్నుఁజుట్టి వింతయగునొక్క
దివ్యతేజంబు చక్రాకృతిని నదేమొ!
సాగరవిచారమునఁ గానఁజాలనైతి
నిమ్మహోత్కృష్టదర్శన మింతవఱకు.

మ. వలయంబై ధవళాంబుజాభమయి దివ్యంబై మహో [దృత్ప్రభా
నిలయంబైన పవిత్ర తేజ మిది దీనింగంటి, నాపుణ్యముల్
ఫలియించెఁ, నమసెన్ సమస్తభవసంబంధానుబంధంబు [లున్
బొలిసెన్ బుద్బుదవర్తనమ్ము, లొలసెన్ ముక్తోన్నత [శ్రీలహో.

క. ఎన్నఁగ ముక్తాస్ఫోటము
హోన్నతపదవిని వహింప నొండొకగతి యుం
డ న్నేరదు సాగరగతి
కన్నను నెవ్వారికనుచుఁ గనుఁగొంటి నిటుల్.

క. అని మనమున నను కొనినం
తనె తత్తేజంబునుండి "తథ్యము! తథ్య"
మ్మనుశబ్దారంభముతో
వినఁబడియెను నాకు నిట్లు విస్ఫుటఫణితిన్.

మ. పరమంబై నరహాస్యమియ్యది గ్రహింపంగంటి వీభాగ్యముల్
దఱు చెవ్వారికినై నలేశమునుబొందన్ రాదుసూ! సాగరాం
తరకల్లోలములం దనామకగతిన్ నాశంబునుం బొందు నీ
సరివారిన్ మణిపూసవైతివి భవజ్జన్మంబు సామాన్యమే?

గీ. సాగరంబునఁ జొచ్చి లేశమ్ము నీవు
జీవనతరంగములయందుఁ జిక్కుకొనవు;
స్వాతి శుభజన్మనక్షత్ర మీ తెఱంగు
నీకు ముక్తాకృతి ఘటించె నిక్కువంబు.

మ. కలవిందేబహురత్నరాసులు, జగత్కల్యాణసంచారముల్
గలవిందే నినుఁబోలువారికిని ముక్తాస్ఫోటభాగ్యోన్నతుల్
గలవిందే, కలవానితో సుఖపడంగా లేక హేయంబుగాఁ
దలఁపం గూడదు సాగరమ్మునిదిసిద్ధాంతంబుమువ్వాటికిన్.

---